# సమాలోచన

## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 — రాజమహేంద్రవరము 16-4-1990, 1-5-1990 — సంచికలు 12, 13

—* ఈ సంచికలో *—



రాబోవు సంచికలో:- 1. ప్రమోదూతకు స్వాగతము (కవిత), 2. ఆధునిక కవిత్వం–కవీ–పాఠకుడూ, 3. బలివాడ వవలాపింధూరం "సుధామధురం". 4. శారశాభారత (ఒరియా)–సమీక్ష, 5. ఆర్యసమాజ స్థాపనకు మూలకారణం. 6. నర్తకి మొదలగు రచనలు ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 12_00 — విడి ప్రతి 0_60 పై.

6 మాసములకు రు. 6_50

సాహిత్యపరమైన రచనలకు సమాలోచన ...

# సంపాదకుని మాట

ఇది పరీక్షాకాలం. విద్యార్థులందరికీ ఏడాది పొడవునా కష్టపడి చదివిన చదువుల కిది పరీక్షా సమయం. చదివిన వన్నీ గుర్తు పెట్టుకుని పరీక్షలలో ప్రశ్నలకు చక్కని జవాబులు వ్రాసి ఉత్తీర్ణులై వారి వారి భవిష్యత్తుకు పునాదులు వేసుకోవలసిన సమయం. వారు పరీక్షలు వ్రాసే సమయానికి చదువుకు భంగం కలిగే రీతిగా విద్యుత్ సరఫరాలో 'కోత' ఏర్పడటం నిత్యావసరవస్తువుల ఉత్పాదనకు భంగం కలిగే రీతిగా పరిశ్రమలు విద్యుత్ కోత మూలంగా కుంటుపడటం మనందరి దురదృష్టం.

ప్రభుత్వం వారెన్ని చర్యలు చేపట్టినా ప్రజల సహకారం లేనిదే ఏమీ జరగదు. ప్రజలలో స్వార్థం పెచ్చుపెరిగి ఎంతసేపూ నాబాగే నాకు ముఖ్యం అనుకునే దుర్లక్షణం సమసి నప్పుడే మనం ఏ ప్రగతినైనా, సాధించగలం. నేను సైతం దేశాభివృద్ధికి రాష్ట్రాభివృద్ధికి ఏం చేయగలను అనే ఆలోచనా, ఆచరణా ప్రతివ్యక్తిలోనూ కలగాలి.

మనిషి మనుగడకి కులం, మతం ప్రాతిపదిక కారాదు. మాటల్లోనే తప్ప కులమత ప్రాబల్యాలు మనస్సుల్లోంచి ఎంతమాత్రమూ పోలేదు. ప్రజలకు సేవచేయడానికి మేం ఉన్నాం అనే రాజకీయ పార్టీలన్నీ ఇంచుమించు వారుచేసే పనులన్నిటి వెనకా ప్రాతిపదికగా కుల మతాల్ని ఉపయోగించు కుంటున్నారనే మాట సత్యదూరమా ? ఒక్కక్షణం ఆలోచించండి. ఇది మనందరికీ మాత్రం పరీక్షాసమయం కాదూ ? ఏమిటి మనకర్తవ్యం ?

—సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## 1. నరసరాజు నాటికలు - వ్యక్తిత్వం

—శ్రీ మంతెన సూర్యనారాయణరాజు

డి. వి. నరసరాజుగారు అంటే దాట్ల వెంకట నరసరాజుగారు అని, ఇంకా ...న్నకోట రామన్న పంతులుగారు చెప్పి ...లు చెప్పాలంటే నవరసరాజు నరసరాజు అని, 'నాటకం' (నాటకం పేరే నాటకం) నరసరాజని చెప్పుకోవాల్సి వుంటుంది.

అసలు విషయంలోకి మనం ప్రవేశించి నట్లైతే తెలుగుభాషలో తొలి ఏకాంకిక ఎప్పుడు పుట్టిందంటే 1926. శ్రీ శ్రీ కందుకూరి వీరేశలింగంగారే దానికి శ్రీకారం చుట్టారని చెప్పుకోవలసి వస్తుంది. వారి తదనంతరం ఎన్నో ఏకాంక నాటికలు వెలువడ్డాయి. నేడీ ఏకాంకికా రచన గణనీయంగా పెరిగింది. చక్కని ప్రాచుర్యాన్ని పొందింది. ప్రారంభ దినాల్లో ఈ ఏకాంకికల్ని భారతి, సాహితి, సఖి, జయంతి, వీణ, శారద, ప్రతిభ పత్రికలు ప్రచురించాయి. అయితే ఈనాడు ఇందులో కొన్ని పత్రికలు కాలగర్భంలో కలిసిపోయినా మిగిలినవాటిల్లో భారతి, ఆంధ్ర ప్రభ (వీక్లీ) ఆంధ్రజ్యోతి (వీక్లీ) వంటి పలు పత్రికల్లో ప్రచురించబడుతున్నాయి.

ఈ ఏకాంక నాటికలు తెలుగులో కలా వచ్చాయని ప్రశ్నించుకుంటే స్ఫురించే కారణాలు ఇవి. ప్రజలలో (ప్రేక్షకులలో) ఓపిక తగ్గడం, విశ్రాంతి తక్కువకావడం ముఖ్యంగా చెప్పుకోవచ్చు. నేడు ఈ ఏకాంకిక రచనలోగాని, ప్రదర్శనలోగాని ఆటుపోటులను తట్టుకోగలిగి నిలదొక్కుకుందంటే నిజంగా హర్షించదగిన విషయమే మరి.

నాటికకు తల్లి నాటకం. ఏమహానుభావులు ఈ సాంఘిక నాటకాలకు దోహదం చేసారో తిరగేస్తే మనకు చరించే వారు తెలుగుభాషలో ముగ్గురే ముగ్గురు, ముండాలూరి కృష్ణారావుగారు, బళ్ళారి రాఘవాచారిగారు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారు అనబడే మూర్తిత్రయం. ప్రదర్శనా సౌలభ్యంకోసమనండి, మిగిలిన వాటికి వాడుకనేకాస్ట్ర్యాప్ప వలన కానివ్వండి ఇబ్బంది తక్కువగా వుండేది ఒక్క సాంఘిక నాటకంలోగాని, నాటికలోగాని అన్న విషయం మనం గమనించాలి. ఆవిధంగా తొలి నాళ్ళలో ఉదయించిన నాటకాలు రక్త కన్నీరు, కన్యాశుల్కం, ఈనాడు, విశ్రాంతి, కప్పలు, భయం, ఎన్. జి. వో మొదలైనవి.

ప్రజానాట్య మండలికూడా తాను రూపుదిద్దుకున్నది మొదలు 'ముందడుగు' 'మాభూమి' వంటి పలు నాటకాలు ప్రదర్శించి అనేకమంది నటులను తయారుచేసి ఆంధ్ర దేశానికి అందించింది. అయితే రాను రాను ప్రజలలో (ప్రేక్షకుల్లో) రెండు మూడు గంటలు కూర్చోబెట్టి ప్రదర్శించే నాటకాలు చూసే ఆసక్తి నశించింది. ఆకారణంగా సుదీర్ఘ నాటకాలకు బదులు ఏకాంకికలు బహుళ ప్రచారాన్ని పొంది ఉంటాయి. అదీగాక కిరాయి విషయంలో కూడా స్త్రీ పాత్రల గురించి కొద్దిగా ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తోంది. ఆ యిబ్బంది ఈనాటికీ నాటకంలోగాని, నాటికలోగాని ఇంకా అలా కొనసాగుతూనే ఉందన్న మాట యదార్థం. అంతేకాకుండా రచనలో 'కమిట్‌మెంట్', 'సాంఘిక చైతన్యం, 'విప్లవాత్మక ధోరణులు' పొడచూపడం జరిగింది.

నాటకాలు వ్రాయడం ఒక ఎత్తు. ప్రదర్శించి ప్రజామోదం పొందటం ఇంకో ఎత్తు. అందుచేత ఆంధ్రదేశంలో నాటకాలుగాని, నాటికలుగాని ప్రదర్శించడం ఎలా ప్రారంభమైందంటే కొద్దిగా ఆంధ్ర నాటక రంగచరిత్ర పుటలు తిరగేస్తే అది 1941లో ఆంధ్రనాటక కళాపరిషత్తు ప్రారంభమైన తొలిదశలోనే అని అనుకోవాలి. ఇది ప్రారంభదశగా పేర్కొంటే రెండవ దశ మరోటి చెప్పాలిగదా! 1946లో ఒక స్థిరమైన రెండో దశ ప్రారంభమైందనీ చెప్పకోవచ్చు. అప్పటిదాకా పద్యాలు, రాగాలు పెద్దవైన వాటితోపాటు స్వాతంత్ర్య సమరానికి ముందంతా పౌరాణిక, జానపద, చారిత్రాత్మక నాటకాలు ప్రబలియున్న విషయం విశదమౌతుంది. రాను రాను స్వాతంత్ర్య సమరం ముగిసింది. దేశం స్వతంత్ర్య భారత్‌గా అవతరించింది. 1945లో అంటే దేశస్వాతంత్ర్యానికి రెండేళ్ళ ముందుగానే ప్రజానాట్యమండలిలో తెలుగుశాఖ ఆవిర్భవించింది. ఆరోజునుండి ఈరోజుదాకా సాంప్రదాయక నాటక పద్ధతులకు స్వస్తి చెప్పి, ప్రయోగాత్మక నాటకాలకు, నాటికలకు నాంది పలకడం జరిగింది. ఆ విధంగా సాంఘిక నాటకం ప్రాచుర్యం పొందగలిగింది.

ఒకనాడు నాటకకర్తగా ప్రాచుర్యాన్ని పొందిన రచయితలే అర్వాచీన కాలంలో నాటికలు వ్రాసి 'సెహబాస్' అనిపించుకోగలిగారు. ఈనాటి దాకా అటువంటివారు కోకొల్లలుగా లేకపోయినా లబ్ధప్రతిష్ఠులైన వాళ్ళగురించి మనం ఇక్కడ చెప్పుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందిమరి. అటువంటివారిలో కీ॥ శే॥ ఆచార్య ఆత్రేయ, కీ॥ శే॥ భమిడిపాటి కామేశ్వరరావుగారు, కీ॥ శే॥ పినిసెట్టి శ్రీరామ్మూర్తిగారు, కీ॥ శే॥ అనిసెట్టి సుబ్బారావుగారితోపాటు ఈనాడు వెండితెర రచయితలుగా చెలామణిలో వున్న గొల్లపూడి మారుతీరావు, డి. వి. నరసరాజు, భమిడిపాటి రాధాకృష్ణగారు, ఎమ్. వి. ఎస్. హరనాథరావు, మోదుకూరి జాన్సన్, ఎస్. ఆర్. నంది, తనికెళ్ళ భరణి, బి. ఎల్. యన్. ఆచార్య, కొర్లపాటి శ్రీరామమూర్తి, శార్ల, చలం ఇలా చెప్పుకుంటూపోతే చాలామంది దర్శన మిస్తారు. పై నుదహరించిన వాళ్ళలో కొద్దిమంది సినిమారంగానికి చెందినవారు కారు నాటకరంగానికే పరిమితమైనవారు.

ఇంకా కొర్రపాటి గంగాధరరావుగారు, రాజమన్నారుగారు, సోమంచి ఎగ్గన్నశాస్త్రిగారు, జంధ్యాలగారు, శ్రీవాత్సవ ఇలా ఎందరో ఉన్నారు. నాటికలు గురించి కొన్ని విషయాలు చెప్పి అసలు విషయంలోకి ప్రవేశిస్తాను. ఏకనాటకము, ఏక వస్తుకము, విధిగా ఏక అంకమూకలిగి స్థలకాలైక్యములు పాటింపబడి, ప్రదర్శనాకాలముకూడా ముప్పది నిమిషములుగాని, నలుబదియైదు నిమిషములుగాని పరిషత్ పరిధిలో అయితే గంటలో ముగిసెడు దానిని ఏకాంకిక అని చెబుతుంటారు. అయితే ఇంగ్లీషు సాహిత్యములో వున్నటువంటి మిస్టరీ, మిరాకిల్, ఇంటర్‌ల్యూడ్స్‌కూడా ఈ ఏకాంకికలకు తుల్యమైనటువంటివిగానే పేర్కొనబడుతున్నాయి.

నరసరాజుగారు 'నాటకం', "వీలు నామా'' నాటకాలకర్తగా, అంతర్వాణి, ఆత్మహత్య, వాపస్, ప్రేమపక్షులు, కోడిపుంజులు, ఈ ఇల్లు అమ్మబడును మొదలైన నాటికల ద్వారా నాటక రచయితగా పేరెన్నికగన్న వ్యక్తి. అన్నింటికంటె ముందువీరు ఔత్సాహిక నటుడుగా, ప్రయోక్తగా, దర్శకుడుగా ఆంధ్రదేశంలో నాటినుండి నేటిదాకా కళాభిమానులకు, సాహిత్యవేత్తలకూ గుర్తుండే ఉంటారు. పోతే డి. వి. నరసరాజుగారి నాటకాల్ని, నాటికల్ని రెండు పాయలుగా వేరుచేసి మళ్ళీ ఆయనగురించి చెప్పుకోవడం ఎంతో ఔచిత్యంతోకూడినటువంటి విషయమనిపిస్తుంది.

ప్రస్తుతం ఈ వ్యాసంలో ఆయన నాటికలు గురించి మాత్ర ప్రాయంగా చెప్పుకుందాం! ముఖ్యంగా నాటికలో చెప్పాల్సిన విషయం వాచ్యం అయితే రుచి చచ్చిపోతుంది. అలాగని కొల్లేరు చాంతాడంత పొడుగు పేనేస్తే అది నలుగుర్ని ఆకట్టుకునేదిగా కేచీ (పట్టేది)గా ఉండదు సరిగదా అనేకానేక విమర్శలకు దారితీసే అవకాశం లేకపోలేదు. నాటికలో ఇతివృత్తం Topical అయిన కారణంచేత ప్రేక్షకుల్లోకి దూసుకుని పోతున్నాయి. రచనాధోరణిలో కాక, విషయప్రాముఖ్యం కారణంగా అవి భాసిస్తున్నాయి.

నేడు సజీవులైన రచయితల్లో నాటక, నాటికరచయితగా తొలిశ్రేణికి చెందిన వ్యక్తి డి. వి. నరసరాజుగారు. సినీసంభాషణారచయిత గానివ్వండి, కథకుడిగా, దర్శకుడిగా గాని తనకంటూ ఓ ప్రత్యేకతను నిలుపుకున్న మహోన్నత వ్యక్తి ఎవరంటేవారే నవరసరాజు నరసరాజన్నమాట. వారిరచనల్లో నాటకాల్లో నాటికల్లోగాని హాస్యరసం ఎక్కువ పాలుతో చిప్పిల్లుతూ ఉంటుంది. అదికూడా కృతకం, కృత్రిమత్వం లేని హాస్యం. ఇంకా చెప్పాలంటే వ్యంగ్య ధోరణిలో సాగి నవ్వుపుట్టిస్తుంది.

కేవలంవారు హాస్యరసానికే పరిమితమైన రచయితకాదు. నవరసాల్నీ సమపాళ్ళలో సందర్భానుసారంగా చక్కగా నాజూగ్గా కళ్ళకు కట్టినట్లు పోషించగలడిట్ట. తెలుగు సాహిత్యంలో

(తరువాయి 8వ పేజీలో)

# 2. వేమన దృష్టిలో వనితలు

—శ్రీ డి. వి. శ్రవణ్ కుమార్. ఎం.ఏ.,

మహాకవి వేమన గురించి తెలియని వారు ఆంధ్రదేశంలో ఉండరనడం అతిశయోక్తి కాదు. ప్రాథమిక పాఠశాల విద్యార్థులదగ్గరనుండి పెద్దలవరకు వేమన పద్యాలు చదువని వారు, వినని వారు ఒక్కరు కూడా ఉండరని చెప్పవచ్చు. వేమన తెలుగుశతక కర్తలలో అగ్రగణ్యుడని చెప్పవచ్చు. కాని ఇంతటి మహాకవి జీవితవిశేషాలను, దేశకాలములను, కుటుంబపరిస్థితుల్ని గూర్చి నిజంగా నిర్ధారణ కాకపోవుట శోచనీయం. వేమన దేశకాలపరిస్థితుల్ని గురించి పరిశీలించిన వారిలో ముఖ్యులు సి. పి. బ్రౌనుగారు. శ్రీవంగూరిసుబ్బారావు వేమనజీవితాన్ని, దేశకాలములను గురించి ప్రత్యేకంగా ఒక గ్రంథం రాశారు. క్రీ. శ. 1920 వ సంవత్సరాన వేమన జయంతి సందర్భంగా కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు గారు పరిశోధనా వ్యాసాన్ని చదివారు. వేమన కవితా విశిష్టతను పరిశోధనాత్మక దృష్టితో వెల్లడించి అతనిని మహాకవిగ పరిగణింపచేసిన కీర్తి శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారికి లభించింది. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము నందు బ్రౌనుప్రాజెక్టులో వేమన గురించి బంగోరగారు గావించిన కృషి ప్రశంసనీయము.

వేమన పద్యాలను సంకలనం చేసి చాలామంది ప్రకటించారు. వేమన గొప్ప భాషాతత్వవేత్త కాదు. సంస్కృత పండితుడూ కాదు, తనకు వచ్చిన స్వచ్ఛమైన తెలుగుభాషలో, సులభశైలిలో, సంగ్రహంగా. సూటిసూక్తులతో పామరులను సైతం రంజింపచేసిన మహాకవి వేమన.

వేమనను ద్రావిడభాషయందు నీతివాక్యాలు రాసిన 'అవ్వాయి'తోను, కర్ణాటకలోని 'సర్వజ్ఞుని'తోను, గ్రీకకవియైన 'టాషియన్'తోను, మహారాష్ట్రుడైన 'తుకారాం' తోనుపోల్చవచ్చును. వేమన వేదాంతము. నీతులు, సత్యములు, హాస్యము మొదలైన విషయాలు అనేకము రాశాడు. వేమనకు సంఘ సంస్కర్తగను, శాస్త్రవిజ్ఞతా వాదిగను, మానవతా వాదిగను నిరూపించుటను అతని పద్యాల్లోని ఆలోచనాపరిధి, అనుభవైకతత్వమే ఆధారమని చెప్పవచ్చు.

వేమన పద్యాలను బట్టి స్త్రీల పట్ల వేమనకు గల అభిప్రాయాన్ని పరిశీలించడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యము.

వేమన పద్యాలలో వనితలను గురించిన పద్యాలను ఒకచోట చేర్చి, వేమన మానసిక పరిణామాన్ని అనుసరించి క్రమపద్ధతిని వానిని పరిశీలించిన ఎడల వేమన తత్వం అర్థమవుతుంది. ఈ దృష్టితో బ్రౌనుగారు వేమన పద్యాలను సంకలన మొనర్చి, వాటిని లాటిన్ భాషలోకి అనువదించారు.

వేమన యుక్త వయస్సులో వివాహమాడి దాంపత్య జీవితాన్ని గడిపిన దశయందు, అంతకుముందు వేశ్యాలోలుడై, భోగలాలసుడై ఉండినాడు. వేమనను సన్మార్గంలో నడపడానికి అతని వదినగారు తన ఆభరణాలను. వస్త్రాలను వేమనకిచ్చి, వివస్త్రయై దానిని నగ్న స్థితిలో ఉంచి వేశ్యకు కానుకగా ఇవ్వడానికి సూచించినట్లు ఒక కథ ప్రచారంలో ఉంది. ఆ సంఘటన తర్వాత వేమన విరక్తుడైనట్లు జన ప్రచారంలో ఉంది.

భోగలాలసుడైన వేమనను దారికి తెచ్చుటకు వివాహంచేసి ఉండవచ్చు. కాని అతను వైవాహిక జీవితం గడుపుతూ, వేశ్యాలోలుడై ఉండెను. భార్యకు దాసుడగుట పౌరుషహీనంగా వేమన భావించాడు. భార్యను కాపాడుట భర్త బాధ్యతని గుర్తించాడు. వివాహమాడినవాడు భార్యని పోషించాలనీ, లేనిచో ఆవిడ ఇల్లువదలి వెళ్ళుననీ, కావలేని వాడు చావవలెననీ చాటిచెప్పాడు. వేమన తల్లిదండ్రులు, అత్తమామలపట్ల గౌరవంగల వ్యక్తి.

'పడుచు నిచ్చు వరని పద్యమిచ్చిన వాని
కడుపు చల్లజేసి ఘనత నిడగ
నడువ నేరవతడు నాలి మూచ్చే గదా'

---

(2వ పేజీ తరువాయి)

బాబాలురాని వాళ్ళెందరో నాటక కర్తలు, నాటికా కర్తలై నవ్వులపాలైన విషయం తెలుగు పాఠకులకు తెల్సిందే. నరసరాజుగారు ఈనాటికీ తనబాణీ, తన ఒరవడి మార్చుకోకుండా తన కంటూ ఓ ప్రత్యేకత (స్పెషాలిటి) ఈ నాటికీ కాపాడుకుంటూ పురోగమిస్తున్న అక్షర శిల్పి.

సాహితీమూర్తిగా ఆయన నాటక రచనతోనే తృప్తిపడకుండా తానే అనేక అవతారాలెత్తి తొలినాళ్ళలో కళామతల్లి ముద్దుబిడ్డగా కళాసేవచేసిన దాఖలాలున్నాయి. ఆయన వ్రాసిన నాటికల్లో కొన్నింట్లో చక్కని పాత్రలు పోషించి రక్తికట్టించారు. 'అంతర్వాణి' 'వాపస్'లో ఆయన పాత్రలు మరచిపోలేనివి. రచయితే తాను సృష్టించిన పాత్రలో నటించడమంటే తాను పరోక్షంగా ఆ యా పాత్రల్లో జీవించడమే నన్న విషయం మనం గ్రహించాలి.

(000)

స్త్రీకి స్వాతంత్ర్యం ఇచ్చి, ఆమె మాటవిని కుటుంబ విచ్ఛిన్నానికి పూనుకొనడం స్వార్థపరుడైన మూర్ఖుని లక్షణమని వేమన భావించాడు.

'ఆలిమాటలు విని అన్నదమ్ములరోసి,
వేరు పడెడివాడు వెఱ్ఱివాడు'

అని చాటి చెప్పాడు.

వేమన మొదట్లో సంసార బాధ్యత అని పట్టించుకోక విలాసజీవిగా, సంపాదన లేక తిరుగుతున్నపుడు, అతని భార్య అదను చూసి మెత్తగా సూటిపోటు మాటలతో ఎదిరించి ఉండవచ్చు. అటువంటి స్థితిలో వేమన ఈ క్రింది పద్యాన్ని చెప్పి ఉండవచ్చని అనుకోవచ్చు.

'ఆలు మగని మాట కడ్డంబు వచ్చెనా
ఆలు గాదది నుదిట వ్రాలుగాని
అట్టి యాలువిడిచి యడవి నుండుటమేలు'

అని, తన స్వేచ్ఛకు అడ్డు తగిలిన భార్యను గురించి పైవిధంగా చెప్పి ఉండవచ్చును.

ఆనాటి సాంఘిక వ్యవస్థలో వేశ్యలకు అధిక ప్రాధాన్యం ఉండేది. వేశ్యలకు ధనమిచ్చి వేమన అన్ని విధాల భ్రష్టుడైనట్లు తెలుస్తోంది. ధనం తీర పోయినా వారకాంతలు వలపు చూపరనే నగ్నసత్యాన్ని వేమన అనుభవపూర్వకంగా గ్రహించాడు. భార్యాపిల్లలతో సంసారంచేసి, వేశ్యలతో సుఖించి భోగలాలసుడైననూ. కష్టాలను అనుభవించక తప్పలేదని చెప్పవచ్చును.

తన కష్టాలకు స్త్రీయే మూలకారణమని వేమన గ్రహించాడు.

'సతుల గవయనేల సుతుల బడయనేల
వెతల బడగనేల వెఱ్ఱితనము
నేల మీద రాయి నెత్తి కత్తినయట్లు'-

అని వేమన వాపోయాడు.

'ఆడుదాని జూచినను అర్థంబు జూచినను
బ్రహ్మకైనను పుట్టు రిమ్మ తెగులు'
అని భావించిన వేమన, ఈ దశలో స్త్రీని గురించి ఇలా చెప్పాడు.

'ఆడదనగ రోత నందు జూచినరోత,
ఉచ్ఛ్వాసపడుట ఉచితమగున'

భోగియై యోగిగా మారిన దశలో వేమన వేశ్యలను గూర్చి, గృహిణులను గూర్చి పైవిధంగా భావించాడని చెప్పవచ్చును. వేమన పరిపూర్ణ తత్త్వమునందు ఆసక్తి వహించి రాజయోగము ననుసరించిన స్థితిలో మహాజ్ఞానిగ తత్త్వ చింతన రూపమూకై పై భావాల్ని వ్యక్తీకరించాడు.

'మొదలు బట్టలేదు, తుద బట్టలేదు.
నడుమ ఈ వేష మెందుకు'

అని గోచిని గోతిలోవేసి దిగంబరుడై తిరిగాడు వేమన. పైవిధంగా వేమన స్త్రీలను గురించి అభిప్రాయపడిన విధాన్ని పరిశీలించడం మైంది. వేమన కవిత, వ్యర్థ పదములు లేకుండా. చక్కని ఉపమానాలతో, సహజ మగు పోలికలతో, జాతీయములతో పాఠకులను పైతం రంజింప చేసేవిధంగా రచించాడు. తెలుగు చదివే వారికి వేమన పద్యాలు చనుబాలువంటివనుట అతిశయోక్తికాదు.

(*.*)

## 3. కవి అంటే "కలకాలం విలువైనవాడు"

—శ్రీ

సాహిత్యానికి ఆదరణ కరువైన ఈ రోజులలో సాహిత్యానికి కళలకు ఆయువుపట్టులైన సాహిత్య కళాసంస్థలను స్థాపించడం ముదావహం. ఆశయాలు నెరవేరినపుడే లక్ష్యం సిద్ధిస్తుందని, రాజకీయాలకు దూరంగా ఇలాంటి సంస్థలు ఉంటే స్వచ్ఛందంగా కూడ తయారయ్యే అవకాశం ఉందని అన్నారు. 24-2-1990 న యాదమరిలో జరిగిన 'ప్రసన్న కళాభారతి' సాహితీ సంస్థ ప్రారంభోత్సవ సభలో ముఖ్యఅతిధిగా విచ్చేసిన పుంగనూరు జూనియర్ కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ కేవ. పిళ్లై.

ఇటీవల యాదమరిలో స్థాపించిన సాహితీ సంస్థ ప్రారంభోత్సవ సందర్భంగ ఏర్పాటుచేసిన ఈ సభలో చిత్తూరు జూనియర్ కళాశాల ఆంధ్రోపన్యాసకులుగా శ్రీ సుబ్రమణ్యం నాయుడు పాల్గొని సామాజిక స్పృహకల్గిన సాహిత్యం ప్రస్తుతం చాలాఅవసరం అన్నారు.

అనంతరం ఏర్పాటు చేసిన కవి సమ్మేళనానికి అధ్యక్షత వహించిన ప్రముఖ కవి, పండితుడు శ్రీ కాణిపాకు లింగన్న ఉత్తమ రచనలు వెలుగులోకి రావాలని అభిప్రాయపడ్డారు. కవిసమ్మేళనంలో పాల్గొన్న కవితలను సమీక్షచేస్తూ శ్రీ లోకా జగన్నాథశాస్త్రి 'కవి అంటే కలకాలం విలువైన వాడ' నీ కావ్యాలుగా తయారయ్యే వాక్యాల కన్నా కావ్యాలన దగిన వాక్యాలు ప్రస్తుతమవసరమని, ఈ విషయాల్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ రచనలు కొనసాగించాలని అన్నారు. నాటకాలలోను, సినిమాలలోను 'కవి'ని హాస్యనటునిగాను, కవిత్వాన్ని హాస్యప్రధానమైన సంభాషణలు గను మార్చి చిత్రీకరించడం శోచనీయమని పేర్కొన్నారు.

కవిసమ్మేళనంలో పాల్గొన్న కవులలో డా॥ కె. రామలక్ష్మి స్త్రీకి సమాజం సమాన హక్కుల్ని కల్పిస్తున్నా. వీటిని వినియోగించుకోవటంలో సమా

కందించిన మహాకవి తెనాలి రామకృష్ణుడు. సరస్వతీదేవియే రామకృష్ణుని రూపము. చదువుల తల్లి రామకృష్ణుని కైతను దీవించినది. ఈ గ్రంథమునందలి కథ స్కాందపురాణమునుండి స్వీకరింపబడెను.

రామకృష్ణకవి "కవిజన సహకారావళీ వసంతోత్సవ సూక్తినిధి" అనగా కవీశ్వరులను తియ్యమామిడి చెట్లయొక్క వరుసనకు వసంతకాలము వలె మంచి మాటలకు నిధియైనవాడు. కవిత్వమునకు చమత్కారము ప్రధానము. "సూక్తినిధి" అను మాటకు తన కవిత్వము చమత్కారపూరితములైన మాటలతో సహృదయులెందరకు ఆనందము కలుగ చేయునని భావము. పదగుంఫనమిట ఆలంబనము. సహృదయు పాఠకుడు కవి అంతరాత్మ తెలిసికొనుటకు ప్రయత్నించును. అప్పుడే కావ్య ప్రయోజనము సిద్ధించును.

సంస్కృతము తెనుగుగ చేయుట యందు, తెనుగు సంస్కృతముగ చేయుట యందు చతురమతి.

ఉదాహరణము - కడయు నడుము మొదలు నేర్పడని వాని (ఆదిమధ్యాంతరహితుడు)

ఇట సంస్కృతపద ప్రయోగమునకు బదులు తెలుగు పద ప్రయోగము కావించెను.

తెలుగు నందు చెప్పదగిన భావమును అసాధారణ రీతిలో సంస్కృత శబ్దము ద్వారా చెప్పుట.

ఉదాహరణము:- 'తృణాంచల విప్రుషములు కావె యనని విబుధాగ్రహముల్'

ఇట నీటి బిందువులను తెలుగు శబ్దమునకు బదులుగా 'విప్రుషములు' అను సంస్కృత పదప్రయోగము.

"తప్పు కలిగిన చోటనే యొప్పుగలుగు
సరసకవితా వశోక్తుల సరణి యందు
కప్పు కలిగిన నీహార కరుని యందు
నమృతధారాప్రవాహంబు లడరఁగాదే?

రామకృష్ణుని కవిత్వ ధోరణి యిట వ్యక్తము. సుకవి వాక్కు సారవంతమైన క్షేత్రము. లోకజ్ఞత కల మహాకవి పద్యములందు తప్పు కనిపించినప్పటికి, అవగాహనా పరిజ్ఞానమున్నయెడల నది ఒప్పుగనే పరిగణింపబడెను. మచ్చ కలిగిన చంద్రుని యందు అమృతధారా ప్రవాహము వ్యాపించి యుండును కదా యని కవి తీర్పు.

నిగమశర్మోపాఖ్యానమందు నిగమశర్మ 'వనితామానసు సూన సాయకుడు' అని పేర్కొనెను. ఎంతటి చక్కని ప్రయోగము? ఉహ్వాని హోమాగ్నియూదకొల్లడుగాని యొరగు విరహాజ్వరాత్రితో వెచ్చనూర్చు' 'ఉహ్వా'ను పద ప్రయోగము పదగుంఫనమునకు ప్రతీక. ధ్వన్యనుకరణమైన శబ్ద గుంఫనమిట నిరూపితము. నిగమశర్మయొక్క ప్రౌఢ సరస్వతి. తెలుగింట ఆడుపడుచు. తమ్మునిపై పెత్తనము చెలాయించినది. లాలించినది. దానికి ప్రతిగా ఆమెయొక్కరను సైతము నపహరించెను. 'పడుపడుక'ను చెప్పక వెడలిపోవుట జరిగెను. కాపు పడతిని వలలో వేసుకొనెను. ఆమె అంద చందములను రామకృష్ణకవి వర్ణించిన తీరు మనోజ్ఞము.

'గతిమధ్య స్తన కుంతల స్తబక శిక్షా
గర్వ దుర్వార యీ
సతిచే మానమె యూనమయ్యె నిక
నిస్సారంబుఁ బ్రాణంబుఁదా
ల్చుతగుల్ కాదని కోపి యావృషలి
వాలుందూపుఁ గొమ్మంట కా
హుతి యా బర్హి మృగేంద్ర కుంభి చమరీ
యూథంబు నేణంబులున్.

ఈ పద్యమందు కవి మొదటిపాదమందు ఆమె అవయవముల సొంపు పేర్కొని, వాటికి పోలిక మృగముల జాబితా నాల్గవపాదమందు చెప్పి ఆ కాపుపడతి యందమునకు మృగములాహుతి యయినవని పేర్కొనుట పద గుంఫనమునకు తార్కాణము. కాపుపడతి తన అందముచే ఆయా మృగముల వేటాడుచున్నదని అర్థము.

పుండరీక చరిత్రమందు పుండరీకుని పితృభక్తి ప్రతిపాదితము. అతని తపశ్శక్తి అనితర సాధ్యము. పుండరీకుని చరిత్రము పాండురంగ మహత్మ్యమునకు ప్రధానము.

'దేవ పితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్' అను ఉపనిషద్వాక్య మిట సమర్థనీయము.

నిగమశర్మకథ, పుండరీక చరిత్రము అను దివానిశలవలె, ఒకే నాణెమునకు రెండుప్రక్కలవలె మానవప్రకృతిలోని మంచీచెడులను రూపకల్పనము చేయుటకు కవి కల్పించెను.

బ్రహ్మచర్యాశ్రమమునకు, గృహస్థాశ్రమమునకు జరిగిన ఘర్షణద్వారా హేలా పరిష్కారము సాధించుట అయుతనియుతోపాఖ్యానము. ధర్మప్రబోధము, ధర్మప్రతిపాదనము దీనియందు ప్రధానము. అయుతనియుతులు ప్రయుతుని కుమారులు. అయుతుడు సంసారజీవితము నొల్లక వాఘూల మునిశాపమునకు గురియై భేకమై, సంసారజీవితము గడపి మోక్షముపొందును. 'కామి గాక మోక్షగామి కాదు' సంసారజీవిత ప్రాముఖ్యత యీ ఉపాఖ్యానము ద్వారా చెప్పెను. వాఘూలముని భీకరస్వరూపమును వర్ణించుటలో పాండురంగ విభుని పద గుంఫనము పరాకాష్ఠ నొందినది.

'భ్రుకుటీ భీషణఫాలభాగుడు తను
ప్రోద్భూత ఘర్మాంబు బిం
దువడున్ బ్రస్ఫుట దోష్ఠపల్లవుడుచేతో
భీతి కృల్లోలతా
రశ ఘూర్ణన్న యనుండుగాక శమసార
స్మేరుడయ్యెం దప
స్వికులగ్రామణి చిచ్చు చంద్రుపాడవై
చెన్నొందు చందంబునన్.'

ప్రౌఢపదబంధము ద్వారా భీకర స్వరూపుడైన వానిని సహృదయునకు సాక్షాత్కరింపచేయుట పదగుంఫనము. కఠినవర్ణ ఘటనా రూపము బంధవికటత్వము ఉదారత యను శబ్దగుణము. "వికటత్వముదారతా" అని వామనుడు చెప్పెను, ఈపద్యమందు కఠినమైన ఉచ్చారణతో కూడిన శబ్ద ప్రయోగము ద్వారా పాండురంగ విభుని పద గుంఫనము సార్థకమైనది.

ప్రౌఢమైన పదములను ప్రయోగించి ఆలంకారిక శైలి సాధించుట రామకృష్ణుని కవితా శిల్పము. పద్యముయొక్క ఎత్తుగడద్వారా అయోతుని వ్యాద్వేగము ప్రదర్శించుట పదగుంఫనమునకు నిదర్శనము. పాత్రోచితమైన భావద్వారా యీ పద్యము రామకృష్ణుని కవితకు మచ్చుతునకగా నిలచినది.

ఉర్వీ ధరము లెక్కయుంటకనే కుచ
కుంభ యుగమెల్లగాక తానుబుటు
మనిన
వాడికైదువులపై బ్రాలనే నిడుం జూపు
డాలొల్లగాక తాబ్రాలు మనిన
మున్నిట సుడి వడి మునుగనే నతనాభి
కవనొల్లగాక తామునుగు మనిన
బెడఁగారు కాలాహిఁదొడుగనే నూగారు
తొడుసల్లగాక తాఁదొడుగు మనిన"

ఒకే పదమును ఒకేపాదమందు రెండు సార్లు ప్రయోగించి విలక్షణార్థము ప్రతిపాదించుటయు పదగుంఫనము.

'ధ్రువక పోగామి యీ మేను
ధ్రువముగామి'
'మినుకు మినుకు మినుకు మనిరెన్'
'తనయుఁడు తనయుండు బిగికదల
కట్లనిరెన్.'

మాటుమాల పదముల ప్రయోగించుటలో రామకృష్ణుడు సిద్ధహస్తుడు. పుట్టనిగువు, దూపాడీవ, చక్షూరాజీవ యుగము, సానాధ్యము, ఆసీనప్రచరాయితము.

రామకృష్ణుడా సురారామ గజము. ప్రౌఢాంధ్ర ప్రబంధములందు పాండురంగ మాహాత్మ్యము విశిష్టమైన స్థానమాక్రమించినది. 'పాండురంగ ముకవి పద్యంబు వారువు' అను వాక్యము ప్రసిద్ధమేకదా!

"The poet is the repository of poetues" అను ఆంగ్ల విమర్శక వాక్యము రామకృష్ణ కవియందు సార్థకము.

(***)

# 5. నవ్వని పువ్వు (సమీక్ష)

—డా॥ ఎ. పద్మబాల, M.A., M.Phil., Ph.D.,

కళాప్రపూర్ణ ఆచార్య సినారె. గారి ప్రథమగేయనాటికల సంపుటి 'నవ్వని పువ్వు'. ఇది 1958 లో 'రాజశ్రీ సాహిత్య కళాపీఠం' - సికింద్రాబాద్' సంస్థచే ప్రకటింపబడింది. ఈ గేయనాటికల సంపుటిని సినారె 'కాలసమాధిలో కన్నుమూసిన కన్నతల్లికి' అంకితం చేశాడు. ఈ సంపుటిలో, 'నవ్వనిపువ్వు,' 'వలపురేడు', 'దగ్ధశాంతి,' 'భిన్న స్వరాలు' - అనే నాలుగు నాటికలున్నాయి. ఈ నాటికలను క్రిందివిధంగ సమీక్షించడమైంది.

## నవ్వని పువ్వు :-

'నవ్వనిపువ్వు' అనేది డా॥ సి. నా. రె. గారి ప్రథమ గేయనాటిక. ఇందులో, కవి, మొగ్గ, తీగ, తుమ్మెద, పవనుడు - అనేవి పాత్రలు.

ఒక తుమ్మెద, మొగ్గను (నవ్వని పువ్వును) కవ్వించి నవ్వించేందుకు ప్రయత్నించగా, ఆ మొగ్గకు తల్లి అయిన తీగ తనబిడ్డను కాపాడుకొనగలగడం యిందులోని కథ. కపట ప్రణయాన్ని చూపి అమాయకుల జీవితాలతో ఆడుకొనే కామాంధులను దృష్టిలో పెట్టుకొని సినారె దీన్ని రాశాడని చెప్పవచ్చు.

ఈనాటిక ఆకాశవాణి హైదరాబాదు నుండిప్రసారమైంది. బహు జనాదరణను పొందింది. ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాల వారు దీన్ని ప్రదర్శించారు. సి. నా. రె. గారు ఈ నాటికను అనేక సభావేదికలపై గానంచేసి రసహృదయులను రంజింప జేశారు.

ఈ నాటికలోని 'కవి' పాత్ర ప్రబోధానికిప్రతీకాత్మకగ కల్పింపబడింది. ఈనాటికలోని కొన్ని రమ్యమైన పంక్తుల్ని మచ్చునకు చూడవచ్చు.

"చివురుటాకులలోన
రవల రేకులలోన

మంచు ముత్యాలుంచి
మంచి మధువులనించి ....
నిన్నుగన్న కన్నతల్లి
నిండు మమతలవెల్లి ...
తనయెద పొరలచే
నునుపాన్పుగా జేసి ....
కడుపార పోషించె ...
ఓ చిన్నిమొగ్గా, ఓ కన్నెమొగ్గా!

వలపురేడు:-

ఇది రెండవ నాటిక. ఇందలి పాత్రలు, రేయి, కలువ, తార, చంద్రుడు. రేయికీ, కలువకు, తారలకూ - చంద్రునికీ మధ్యగల ప్రణయము, రేయి, కలువ, తారలకు మధ్య చెలరేగిన సవతిపోరాటము ఇందులోని వస్తువు. ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారమైంది.

చంద్రునికి - తారాపతి, రేరేడు, కలువలచెలికాడు అని వున్న పర్యాయపదాల పరమార్థంతో, చంద్రునకు తారను, రేయిని, కలువలను ముగ్గురు భార్యలను కల్పించి, వారి మధ్య కలహాలు కల్పించి, చివరకు వారి నొక్కచోటచేర్చి నాటికను రక్తి కట్టించటం ఈ నాటికలో జరిగింది.

ఈ నాటికలోని సుందరమైన సూక్తులు కొన్ని చూడండి.

"తార నా ప్రణయ తో
షారాణి దివిలోన
కలువ నా వలపు వ
న్నెలరాణి భువిలోన
రేయి నా ప్రియరాణి
దివిలోన భువిలోన
ముగురు నా నవప్రేమ
మూర్తులే యౌతారు
కలకాల మిటువలె
వలపించి పోతారు"

దగ్ధశాంతి:-

'దగ్ధశాంతి' నాటిక ద్వారా సినారె యుద్ధవిముఖత్వాన్ని, శాంతిప్రియత్వాన్ని బోధించారు. శాంతి, మానవుడు, దానవత, అపరిచిత కంఠాలు ఇందులోని పాత్రలు. శాంతిని నిర్మూలించే దానవతా శక్తుల విజృంభణాన్ని ఎదుర్కొనలేని మానవుడి విపత్కర పరిస్థితి ఈ నాటికలోని ఇతివృత్తం. విశ్వశాంతి పరిరక్షణం మానవుని కర్తవ్యమని ప్రబోధించే నాటిక దగ్ధశాంతి.

మచ్చునకు కొన్ని గేయాలు:-

'లోకంలో క
ల్లోలం లేపి
మానవతా మం
దారం నలిపి
ప్రపంచ శాంతిని
భగ్నంచేసే
ప్రఫుల్ల శాంతికి
కాటలుమూసే
దానవతా! నీ
దారుణకాండలు
సహించలేమిక
వహించలేమిక'

అంటూ మానవుడు పలికాడు.

'సమరభేరివి సమరభూమివి
దానవతావికట హేలవు
చీకటి గుండెల జ్వలియించే
కోష్ణరుధిర పిపాసవు....'

లాంటివి వున్నాయి.

భిన్నస్వరాలు:-

ఇది అభ్యుదయ కవితా ప్రబోధ దృశ్యకావ్యానికి రూపకల్పనం. కళాజీవి, ప్రణయిని, అనాథ, లోకం-అనేవి ఇందలి పాత్రలు.

ఒక యువకళాజీవి భోగకాంక్షితైన 'అల్పకామినీ సుఖాలను ఆశించక, శ్రమజీవుల ప్రోదుంబరుకులను చిత్రించటమే తన కళాప్రయోజనంగా గ్రహించి, అందుకు పూనుకోవడమే ఇందలి ఇతివృత్తం. ప్రణయిని పాత్రతో భావకవిత్వతత్వాన్ని, అనాథపాత్రతో అభ్యుదయ కవితా తత్వాన్ని ధ్వనింప చేశాడు సినారె.

'లోకం'నోట నాటిక అద్యంతాల్లో,
'జీవన సంధ్యాగీతం
భిన్నస్వర సంకేతం ...
కామినీ దృగంతాలు స్వర్గలో
కాలమాట మరపించూ
పేదవాని కన్నీటి మంటలో
రాతిగుండె ద్రవియించూ'-

అనేగీతాన్ని పలికించి నాటికలోని వినయాన్ని సూచించాడు కవి.

కవితా సౌందర్యానికి కొన్ని పంక్తులు:-

'కాటుకక్రమ్మింగిన కారుమబ్బులో
వెలుగు సురుగు పాకాడూ
పాలవెన్నెల సంపాతాలలో
నీలినీడ నడయాడూ'
"నాకము వెలిగించు
నవదీప కళికా!
నాభావి జీవనా
నందాల మొలకా"

ప్రతిష్ఠాత్మక 'జ్ఞాన పీఠ్' అవార్డు గ్రహీత, కళాప్రపూర్ణ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, 'నవ్వని పువ్వు' అనే గేయనాటికా సంపుటినే గాక, అజంతాసుందరి' అనే గేయనాటికల సంపుటిని (1955), "వెన్నెలవాడ"-అనే గేయనాటికల సంపుటిని (1959) వెలువరించారు. వీరు గేయనాటికా సాహిత్యమే గాక, ఖండకావ్య సాహిత్యాన్ని, కథాగేయ కావ్యసాహిత్యాన్ని, సుదీర్ఘ గీతి కావ్యసాహిత్యాన్ని, వచనకావ్య సాహిత్యాన్ని, చిత్రసాహిత్యాన్ని వెలువరించారు. ఆధునికాంధ్ర కవులలో సినారె అగ్రగణ్యు డనవచ్చు.

—0—

# 6. శివానంద గేయలహరి

(ఆదిశంకరుల శివానందలహరికి గేయానువాదము)

—శ్రీ వెలుదండ సత్యనారాయణ, M.A., Ph.D.,

* శ్లోకము *

జలధి మథన దక్షో నైవ పాతాళభేదీ
నచ వన మృగయాయాం నైవ లుబ్ధప్రవీణః
అశన కుసుమ భూషా వస్త్రముఖ్యాం
సపర్యాం
కథయ కథమహం తే కల్పయానీందు
మౌళే॥ 85

* గేయము *

సాకీ: భోజనము నమరించలేను
అంబరము సవరించలేను
నగలు తీరిచి మురియలేను
విరిని సిగలో తురుమలేను

ప: సేవ చేయ దయామయా!
చేతగాదు ఇదేమయా! ॥సేవ॥

చ: కడలి మథనము చేయలేను
కాలకూటము తీయలేను ॥కడలి॥
కాలకూటము తీసి నీ కయి
భోజనము నమరించలేను ॥సేవ॥

చ: అడవిలో వేటాడలేను
హస్తిచర్మము నొలుచలేను ॥అడ॥
హస్తిచర్మము నొలిచి నీ కయి
అంబరము సవరించలేను ॥సేవ॥

చ: పుట్టలను పెకలించలేను
నాగులను చేపట్టలేను ॥పుట్ట॥
నాగులను చేపట్టి నీ కయి
నగలు తీరిచి మురియ లేను ॥సేవ॥

చ: జలధి మథనము సలుపలేను
జాబిలిని వెలయించ లేను
జాబిలిని వెలయించి వాడని ॥జల॥
విరిని సిగలో తురుమలేను ॥సేవ॥

* శ్లోకము *

జ్వాలోగ్రః సకలామరాతి భయదః
క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే
కిం పక్వ జంబూఫలం
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా
వా కంఠదేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణ మయం
శంభో! మహాత్మన్ వద ॥ 82

* గేయము *

ప: జ్వాలలు జ్వాలలు జ్వాల లదే!
హాలాహల మను డోల లదే!
నింగియు నిప్పై భగ్గుమంటున్నది
భూమియు బూడిద బుగ్గౌతున్నది
॥జ్వా॥

చ: భయపడి త్వరపడి దేవతలు
తడబడి పరుగిడి పోయిరయో!
చూచిన కన్నులు చురుకెక్కుతున్నవి
చురుకైన చూపులు కరువై పోతున్నవి
॥జ్వా॥

చ: అరచేతి పయిన ఆడించుటకై
అల్లల నేరెడు పండా యేమి?
నాలుక పయిన తేలించుటకై
నల్లని మిఠాయి బిళ్ళా యేమి? ॥అర॥
లీలగ గళమున కీలించుటకై
నీలపు మణిభూషణమా యేమి? ॥జ్వా॥

చ: అరచేతి పయిన ఆడించితివే!
నాలుక పయి తేలించితివే!
లీలగ గళమున కీలించితివే!
మేలుగ ధర పాలించితివే! ॥అర॥
హాలా హలాన జ్వాలలను
నీలాల మాలగా మెరిసే ॥హాలా॥
నీలాల మాలగా మెరిసే
మేలైన లీలగా మురిసే...

* శ్లోకము *

సంధ్యాఘర్మ దినాత్యయో హరికరా
ఘాత ప్రభూతానక
ధ్వానో వారిద గర్జితం దివిషదాం
దృష్టిచ్ఛటా చంచలా
భక్తానాం పరితోషబాష్ప వితతి
ర్వృష్టిర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వల తాండవం విజయతే
తం నీలకంఠం భజే॥ 54

* గేయము *

ప: ఓహోహో నీలకంఠ తాండవం
ఉమా మయూరితో నీలకంఠ
విలాసం ॥ఓ॥

చ: జనార్దనుని మద్దెల సవ్వడి ఉరుములే!..
జనార్దనుని మద్దెల సవ్వడి
ధణ ధణ ధణ ఉరిమెనే! ॥ఓహో॥
ఉరుములు ఉరుముచునుండగ
సంజవేళ కెంజాయల
నోహోహో నీలకంఠ తాండవం
అఖండ తాండవం

చ: ఆ దివిజుల చూపుల గుంపులు
మెరుపులే!
ఆ దివిజుల చూపుల గుంపులు
మిల మిల మిల మెరిసెనే! ॥ఓహో॥
మెరుపులు మెరయుచు నుండగ
సంజవేళ కెంజాయల
నోహోహో నీలకంఠ తాండవం
అఖండ తాండవం.

చ: పులకితులగు భక్తుల బాష్పము
చినుకులే!
పులకితులగు భక్తుల బాష్పము
జల జల జల చినికెనే! ॥ఓహో॥
చినుకులు చినుకుచు నుండగ
సంజవేళ కెంజాయల
నోహోహో నీలకంఠ తాండవం
అఖండ తాండవం ఓహోహో...
ఓహో...

(0)

# 7. జానపద దృశ్యసాహిత్యంలో కనిపించే సాంఘిక విషయాలు

—శ్రీమతి ఎం. లక్ష్మీరామకృష్ణ

జానపదదృశ్య సాహిత్యం ఆద్యంతాలు లేని ఒక ప్రవాహం. అది దృశ్యాదృశ్యంగా పామర జనసంఘంలో ప్రవహిస్తూ వస్తోంది. శిష్టసాహిత్యానికున్నట్లు నియమ నిబంధనలు, లక్షణాలు, సమయాసమయాలు, ఔచిత్యానౌచిత్యాలు మొ॥నవి జానపద సాహిత్యానికి మృగ్యం.

అసలు మానవుడి సాహితీ సృజన సమాజ జీవితం నుండే ఉద్భవించినది. మానవుడు ఏకాకిగా జీవించలేడు. అతని చుట్టూ ఒక సమాజం. ఆ సమాజానికి కొన్ని నమ్మకాలు, వృత్తులు, ప్రవృత్తులు, ఆచార వ్యవహారాలు వుంటాయి. ఆ సమాజం తన స్వరూపస్వభావాలను తన మాటలో, పాటలో, ఆటలో ముద్రించుకుంటూ ఉంటుంది. అదే సాహిత్యమవుతుంది. ఈ సాహిత్యం సంగీత నృత్యకళలతో జత కూడినపుడే దృశ్య సాహిత్యం ఆవిర్భవిస్తుంది.

దృశ్యసాహిత్యం కంటికీ చెవికీ, మనస్సుకూ సమానంగా ఆనందాన్ని, సందేశాన్ని అందిస్తుంది. ప్రేక్షకులనండి, శ్రోతలనండి, ఎవరైనా ఆ దృశ్యసాహిత్యాన్ని అనుభవించేటప్పుడు సామాజికంగా ఒక ఏకాగ్రత, ఒక ఏకత్వమూ పొందుతూ ఉంటారు. ఈ తన్మయత్వం, ఈ రసానుభూతి కేవలం కథవినటం వల్ల మాత్రమే కలిగేది కాదు. ఆ కథను మనోనేత్రాలకు కూడా గోచరించేటట్లు చెప్పకపోయే ప్రదర్శకుల నాట్యభంగిమ, కథాకథన దక్షత, వాద్య విశేష కౌశలం, హాస్యసంభాషణ, వాచకాభినయం వంటి అనేక విషయాల మీద ఆ రసానుభూతి ఆధారపడి ఉంటుంది. ఒక జాతిని సంస్కృతి బంధంతో పెనవేసుకొనేటట్లు చేయగల సాహిత్యం నిజానికి సార్వజనీనమైన ఈ జానపద దృశ్య సాహిత్యమే.

మన సాహిత్యం తొలినుంచీ రెండు పాయలుగా, ప్రవహిస్తున్నదనీ, అవి మార్గ, దేశి ప్రవంతులని అంటారే కానీ, నిజానికి అనాదిగా వస్తున్న సాహిత్యం దేశిసాహిత్య మొక్కటే. అందులోనిదే ఈ జానపద దృశ్యసాహిత్యం. దీన్ని నాగరికులు సంస్కరించి, ప్రౌఢరీతులలో సంతరించి, మార్గసాహిత్యం సృష్టించుకున్నారు. ముందు వచ్చిన చెవులకన్నా వెనకవచ్చిన కొమ్ములువాడి అన్నట్లు మార్గసాహిత్యం కొమ్ములు పెంచుకొని కూర్చున్నది. దేశిసాహిత్యం నిరాడంబరంగా ప్రజాసామాన్య జీవనాళికగా ప్రవహించుతూ ఉన్నది.

ఒక జాతియొక్క గతచరిత్ర గురించో, ఆచార వ్యవహారాల గురించో, మనుగడ తీరుగురించో, తెలుసుకోవాలంటే, ఆ జాతి తరతరాలుగా గృహసీమలలో, పండుగలలో, పబ్బాలలో పాడుకొనే పాటలూ ఆట-పాటలు పరిశీలించి తీరవలసిందే. కనుక జానపద దృశ్యసాహిత్యం జాతీయతకొక అద్దంలా పనికొస్తుంది.

జానపద దృశ్యసాహిత్యం అయుష్కుతులమీద ఆధారపడి వేల సంవత్సరాల నుంచీ ప్రజాజీవిత నిత్యకృత్యాలలో జీవిస్తోంది. దానికి లిఖితరూపమంటూ ఒకటి ఇటీవల ఏర్పడుచు వంటున్నామే కానీ నిజానికి దాని స్వరూప మంతా మౌఖికమైనదే. ఆశుకవితకు దగ్గర చుట్టం జానపద కవిత. అయినా ఆశుకవితను అప్పటికప్పుడు చెప్పి ఆనందించి మరచిపోయే అవకాశం ఉంది. ఆశుమాపంలో ఆవిర్భవించిన జానపద సాహిత్యం ఒక తరంనుంచి మరొకతరానికీ ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికీ పాకిపోతూ ఉంటుంది. బొమ్మలాటలూ భాగవతాలూ, వీధి నాటకాలూ అలాంటివే.

యక్షగానం ఈదృశ్య జానపద సాహిత్యంలో ప్రముఖపాత్ర వహించింది. దక్షిణ భారతదేశమంతటా ఇది దేదీప్యమానంగా వెలుగొందింది. అసలు దీనిని ప్రచారంచేసిన జాతిపేరు జక్కులు. కాకతీయుల కాలంనుంచీ ఈ జక్కులు యక్షగానాలను వీధులలో ప్రదర్శించేవారని మనకనేక సాక్ష్యాలు కనిపిస్తాయి.

ఏల పాటలు, జోలపాటలు, ఆరతులు, ధవళాలు, చందమామపాటలు, వెన్నెలపదాలు, తుమ్మెద పదాలు, మొదలయినవి నన్నయకు ముందునుంచీ కూడా తెలుగు నాట ప్రచారంలో ఉన్నాయంటే, వాటిని ఈ జక్కులు ఈ యక్షగానాల ద్వారానే ప్రచారం చేసిఉంటారని మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారు అంటున్నారు. యక్షగానానికి ఎంత చరిత్ర ఉన్నదో చూడాలంటే యస్వీ. జోగారావు గారి బృహత్పరిశోధనా నిబంధాన్ని పరిశీలించ వచ్చును.

కూచిపూడి సిద్ధేంద్రయోగిదళంవారు ఆంధ్రదేశంలో ప్రచారానికి తెచ్చిన వీధి నాటకాలు, గొల్ల కలాపాలు, భామాకలాపాలు, మొదలగు అనేక కళారూపాలు ప్రజా హృదయాలను ఉర్రూతలూపాయి.

(తరువాయి 12వ పేజీలో)

# పండిత సత్కారం

రాజమండ్రి, మార్చి 28 :

యుగాది నాడు హిందూసమాజం గీతావర్గం ఆధ్వర్యంలో మహాప్రవక్త, పండితప్రకాండులు నగు ప్రొఫెసరు డాక్టరు తంగిరాల వేంకటనారాయణ శాస్త్రి, వీరిసతీమణి శ్రీ లక్ష్మీ గార్లకు వైభవంగా పండిత సత్కారం జరిగింది.

సభకు శ్రీ గాయత్రీ బాబా అధ్యక్షత వహిస్తూ గాయత్రీ మంత్రం విశిష్టతను వివరించారు. ప్రతిభాసంపన్నులైన ఆచార్యసింహ తంగిరాల వారిని సన్మానించడం పట్టణపౌరుల సన్మానంగా పేర్కొన్నారు.

తొలుత శ్రీ కందుకూరి కొండావధానులు వేదాశీస్సులనందజేశారు. గీతావర్గం కార్యదర్శి శ్రీ సత్యవోలు వరప్రసాద మూర్తి సన్మానితులను పరిచయంచేస్తూ ఆంధ్ర కాళిదాస బిరుదాంకితులు డాక్టరు నారాయణశాస్త్రి సరికొత్తదైన సత్య సిద్ధాంతాన్ని వెలికిదీసి ప్రజాప్రాణం గ్రంధాన్ని (ఎ. బి. ఎస్. ఫార్ములా) రచించారని అన్నారు. ప్రతిసం॥రం మాదిరిగా పండితసత్కారం ప్రమోదూత యుగాదికి, గతరెండుగోజులుగా తమగ్రంథంలోని ప్రత్యక్షదైవ సిద్ధాంతాన్ని సింహగర్జన చేస్తున్న శ్రీ శాస్త్రి గారికి విద్వత్పూజచేయటం అదృష్టంగా భావిస్తున్నామని అన్నారు.

హిందూసమాజం అధ్యక్షులు శ్రీ న్యాపతి లక్ష్మీనరసింహారావు సన్మాన సారధ్యం వహించి శ్రీ శాస్త్రిని దుశ్శాలువతోను, పర్సుతోను సత్కరించారు.

అనంతరం బ్రహ్మశ్రీ కె.సూర్యప్రకాశ శాస్త్రి వేదాశీస్సుల నందిజేస్తూ ప్రమోదూత సర్వులకు శాంతి సౌఖ్యాలనందజేయాలని కాంక్షిస్తూ నూతన సం॥ర పంచాంగ పఠనం గావించారు.

తమకు జరిపిన సత్కారమునకు సమాధానమిస్తూ నేడు మనం ప్రమోదూత సంవత్సరానికి స్వాగతం పలుకుచున్నాము. "ప్ర మో దూ త" అనే నామానికి అర్థం వివరిస్తూ అదృష్ట భాగ్యాన్ని కలిగించే దివ్యమైన భావం అని అన్నారు. ఏ విలువలేనిది నమస్సు. అన్ని ఉత్తమ విలువల సమాహారం ప్రమస్సు. ఆ వరాన్ని అందించటానికి వచ్చిన దైవదూతయే ప్రమోదూత అని సన్మానానికి కృతజ్ఞతలు తెల్పారు.

ప్రొఫెసరు శాస్త్రి తమ సింహగర్జనతో యింకా రాజమహేంద్రవర ప్రజలను యిలా ప్రబోధించారు. 'భాషాసంపత్సంస్కృతులలో సాటిలేనినేల రాజమహేంద్రవరము. మీ పట్టణం నన్ను ఆహ్వానించింది. ప్రతిమనిషినీ బాగుచేసి జగత్కళ్యాణానికి సాధనంగా ఉపయోగించే కొత్తవెలుగు ఈ ప్రత్యక్షదైవ సిద్ధాంత గ్రంథం. ఇచ్చటి మహామహులు దీనితో సాటియైన రచన సృష్టిలోలేదని స్థిరపరచారు. దీని ద్వితీయముద్రణ రెండు వేల ప్రతులు వేయిస్తామని పట్టణప్రముఖులు నిర్ణయించారు. ఇది ఒక మహోద్యమం. అన్ని దైవ, సాంఘిక, సాంసారిక కార్యాలకంటె మించిన పవిత్రకార్యం. ఈ ఉద్యమవ్యాప్తిలో మీరంతా భాగస్వాములై శక్తివంచన లేకుండా సహకరిస్తారని ఆశిస్తున్నాను.'

"శ్రీ గాయత్రిబాబా తమప్రసంగంలో 108 పర్యాయాలు అని సంఖ్యనువాడారు. 108 అనాదిగా ఎందుకు అమలులో వున్నదో ఆ సంఖ్యలోని రహస్యం ఏమిటంటే 'బ్రహ్మ' అనే పదానికి అది సంకేతం. 'క' మొదలుకొని బ, ర, హ, మ అనే అక్షరాలవరకు లెక్కించి కూడితే 108 వస్తుంది. మనము దేవతా విగ్రహాలను పూజించేటప్పుడు అది రాయి అని, లోహమని, మట్టి అని అనుకోము. శివుడుగానో, విష్ణువుగానో, గణపతి గానో పూజచేస్తాము.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే వేద వచనాన్నిబట్టి వేరే ఏదైవమూ, దేవతా ఎక్కడా లేరు. ఒక్క బ్రహ్మనే, పర బ్రహ్మనే ప్రార్థించండి. లేనియెడల మీకు ఫలితముండదని చెప్పటానికి ప్రాచీన ఋషులు 108 అను అంకెను పాటించారు. వేదాన్ని సరిగా అర్థంచేసుకుంటే ఆ బ్రహ్మకూడా ఏమీ యివ్వడు. బ్రహ్మ అంటే అంతటా నిండినది అనే భావం మాత్రమే! ఆ బ్రహ్మ అసలుపేరు "సత్యము." "బ్రహ్మనో నామ సత్యమ్" అనేది శ్రుతి వాక్యము గావున మీరందరూ ఆశ్రయించవలసినది ప్రత్యక్ష దైవము. ఈగ్రంథసారమైన సత్యాన్ని అన్ని ఫలాలు యిచ్చి కోరికలను తీర్చేది ఒక్క సత్యతత్వమే! అదే నా ఎ. బి. ఎస్ ఫార్ములాలోని 'సి'. ఇది సృష్టిలో ఎవరికీ తెలియని క్రొత్త పరిశోధన. ఈ నా సిద్ధాంతాన్ని తెలిసికొనని యెడల ప్రపంచంలో ఏ జాతీ బాగుపడదు. ఈ రహస్యం వేదసారమేగాక సైన్సుసారం మరియూ సృష్టిప్రాణం కూడాను.'

'పట్టణ ప్రముఖులు త్వరలో ప్రజాప్రాణాన్ని పునర్ముద్రింప చేస్తారని. హైదరాబాదునుంచి మీ పట్టణానికి అతిథిగా వచ్చిన నాకు సాదరంగా కార్యసిద్ధిని సమకూరుస్తారని ఆశిస్తున్నాను' అన్నారు.

'యుగాదినాడు కాలజ్ఞానముపై ప్రసంగించమని కోరారు. నాకు తెలిసిన సత్యసారాన్ని వ్యక్తం చేయడం నా ధర్మం. 'జ్ఞాన స్వరూపమే హాహు ర్జగదేతద్విచక్షణాః' అని వేదవిదులు స్పష్టం చేశారు. ఈజగత్తు మహిమాప్రదర్శకతల

చేతిలోని కీలుబొమ్మ కాదు. అనంతము నిత్యనూతనమైన ఈ జ్ఞానజగత్తులోని భవిష్యత్ ఏనాడో వేదాలకు ముందు తయారైన టేపురికార్డరుగా పలకటం సత్యం కాదు. ఇది వేదానికి, సైన్సుకు విరుద్ధం. 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' 'సచ్చిదానంద హీనః' అనే శ్రుతివాక్యాలను బట్టి దేవుడే లేని, సృష్టే లేని విచిత్ర స్థితిలో కాలం కూడా లేనే లేదు. ఉన్నట్లుగా కనబడే కాలంలోని భావిఘటనలు పేర్లు ఏమైనా ఎలాంటివో ప్రత్యక్షర సిద్ధంగా భూతంలోనే నిర్ణయింపబడేవి కావని మహాతత్త్వవేత్తలందఱూ సుక్రమమైన సృష్టిలో అంగీకరిస్తారు.

'జ్యోతిశ్శాస్త్రము కొన్ని నియమాలకు లోబడి పరిమితపరిధిలో కొంతవరకు భవిష్యత్తును సూచిస్తుందని అనడం నిస్సందేహంగా వేదశాస్త్ర విజ్ఞానశాస్త్రసమ్మతం. అయితే అది అలాగనే జరిగితీరాలంటే జరుగకపోవచ్చునని సమాధానము వస్తుంది. 'అహం బ్రహ్మాస్మి' అనే శ్రుతిని లోతుగా అర్థం చేసుకుంటే ఈ సమాధానములోని నిజం సువ్యక్తమవుతుంది.

మానవుడినిగాని, జాతినిగాని కాపాడేది ఏనాడైనా ఒకేఒక సత్య తత్త్వ సూత్రం. దీని ఆచరణ అంతేకాని యింకేమీ కాదు. ఏనాడూ ఎవరికీ తెలియని ఈసూత్రం ఈనాడు నా గ్రంథం ద్వారా లోకానికి వెలుగై బయటికి వచ్చింది. ఆ సూత్రానికే ప్రముఖ్య దూతలైన ఈ ఉగాదిరాజమండ్రిలో సన్మానాన్ని ప్రప్రథమంగా జరిపింది. ఈ ఎ. బి. ఎస్. ఫార్ములా లేక ప్రజాప్రాణం అనే గ్రంథాన్ని పొంది. అనేక పర్యాయములు చదివి అర్థం చేసుకోండి అని ప్రబోధించారు.

శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి వందన సమర్పణ స్వస్తివచనములతో సభ ముగిసింది.

లోకా సమస్తా సుఖినో భవంతు.

—(శ్రీ సత్యవోలు)

(000)

# మేలుకొలుపు

—కి॥ శే॥ బులుసు వెంకటేశ్వరులు

క్షణికముల్ జీవితంబులు సంపద లతి
చంచలంబులు; అధికార పదము లగు
పదవు లన్నియుఁ బతన స్వభావము లగు
మేలుకొనుమోయి మానవా! మేలుకొనుము ౧

ఎండమావులు భోగముల్; పండు మట్టి
కుండ లీ దేహముల్ చిల్లి కుండలు గద!
భ్రమలు సర్వము కనఁబడు వస్తువు లవి
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౨

మట్టిలో పుట్టి పెరుగుచు మట్టిలోనె
మట్టిలోపల నెన్నఁడో మాయమగును
తనువు లన్నియు నమ్మఁగాఁదగదు వీవి
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౩

పరమపావన తత్త్వసంపదలు నింపు
భరతజనయిత్రి బిడ్డవు భవ్యముగను
తల్లి ఋణమును తీర్పుము తత్త్వముఁ గని
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౪

మహితధర్మము నరులకు మహితవిధియుఁ
దన్నుఁ దా నుద్ధరించుకో మన్నతి గని
శాశ్వతానందకర మనశ్శాంతిఁ గనుట
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౫

మహిత భారతభూమి జన్మంబు గనుట
పూర్వపుణ్యవిశేషంబు; పొంది దాని
సార్థకము చేసికొనగు జ్ఞానమునను
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౬

పరమపావన భారతధరణిఁ బుట్టి
స్వార్థపరతఁ గుంఠితరత్వంబుఁ గనుట
సిగ్గుచేటు నీచత్వము చెందవలదు
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౭

రాజకీయముల్ స్వార్థపరమ్ము లగుట
సత్యధర్మ బద్ధములు కాఁజాలవు కద!
మొదటికే మోస మగు నందు మునిఁగిపోకు
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౮

పుట్టినప్పుడు నీ తెచ్చి పెట్టుకొన్న
దేది? కొనిపోవునది గతియించునపుడు
నేది? ధర్మమే విడువకు మెన్నఁడు నది
మేలుకొనుమోయి! మానవా! మేలుకొనుము. ౯

మాయ ఈలోక మెల్లను మాయ ఇందు
ఎంతవారును పడిపోయి వంత గందు
రిది యెఱింగి జ్ఞానమ్మున మది నిలుపుము
మేలుకొనుమోయి! మానవా!
మేలుకొనుము. ౧౦

( * * * )

(10వ పేజీ తరువాయి)

సినిమా వచ్చిన తరువాత అది ఏ విధంగా జాతి జీవనరీతులను ప్రభావితం చేస్తున్నదో, సినిమాకాని కిందటి దృశ్య రూపంగా వున్న ఈ జానపద కళారూపాలు జాతిని అలాగే ప్రభావితం చేసాయనటం సత్యదూరం కాదు.

జంగములు వంటి కొందరికి వృత్తిగా జీవనోపాధి కూడా చూపించిన దృశ్య సాహిత్యం పాశ్చాత్యనాగరికత ముదిరిన తరువాత క్షీణించ సాగినా, మనజాతిని సమైక్యంగా ఉంచగలిగిన ఈ సాహిత్యానికి మనం ఋణపడి ఉండక తప్పదు.

జానపద దృశ్యసాహిత్యం గురించి ఇటీవల కాలంలోనే మెండైన పరిశోధన క్రమంగా మూడుపువ్వులు - ఆరుకాయలుగా వృద్ధిపొందుతున్నది.

ఈవిషయంలో మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, బిరుదురాజు రామరాజు, తుమాటి దోణప్ప, ఆర్వీయస్ సుందరం, నాయని కృష్ణకుమారి, యస్వీజోగారావు, తంగిరాల వెంకట సుబ్బారావు, నేదునూరి గంగాధరం, ఎల్లోరా, జి. యస్. మోహన్, హరి ఆదిశేషువు, ఎస్. గంగప్ప వంటి వారెందరో పరిశోధనలు సాగించారు.

ఎందరో మహానుభావులు
అందరికీ వందనాలు.

—0—

# 8. ఈ బంధాలకు చిత్రాలెలా ఉంటాయి? తెలిస్తే చెప్పండి!

—శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

కాణాదం పెద్దన సోమయాజి 18 వ శతాబ్దమందుండిన విద్వత్కవి పండితుడు (ఈకవిని గురించిన వివరాలకు "సమాలోచన" సంపుటము 12, సంచికలు 22, 28 లో ప్రచురితమైన "కాణాదం పెద్దన సోమయాజి కృతులు_ఒక పరిశీలన" అనే వ్యాసం చూడగలరు). ఈ కవివర్యుని రచనలు (1) భోజచంపూవ్యాఖ్య (సంస్కృతం), (2) శేషశైలేశలీల (అపంచవర్గీయకృతి), (3) మత్స్యపురాణము, (4) యథాశ్లోక తాత్పర్య రామాయణ బాలకాండ, (5) ముకుందవిలాసము, (6) అధ్యాత్మరామాయణము, వీటిలో మొదటి మూడురచనలూ అలభ్యాలు. "బ్రాహ్మణవంశము" అనే గ్రంథమును కూడ కాణాదం పెద్దన రచించినట్లు పరిశోధకపండితులొకరు నాతో ఇటీవల చెప్పిరి. పెద్దన రచించిన (పెద) సోమభూపాలదండకము (భోగినీదండకము లాంటిది) అసమగ్రముగ (లిఖితప్రతి) ఇటీవల లభించినది.

పెద్దన సోమయాజి చిత్రకవితాప్రియుడు. ఈ కవి రచించిన ముకుందవిలాసము, అధ్యాత్మరామాయణమునందు బంధగర్భచిత్ర కవిత్వాలకు సముచిత స్థానం కల్పింపబడినది. అట్టి కవితలు సందర్భోచితములుగా కూడ ప్రయోగింపబడుట గమనార్హమైన విషయం.

పెద్దన సోమయాజి అధ్యాత్మరామాయణంలోని రెండు బంధాలకు, చిత్రాలెలా ఉంటాయని బంధకవితా విశారదులను ఎందరో పండితులను పరిశోధకులను సంప్రదించినాను. ఆ బంధాలకు చిత్రాలెలా ఉంటాయనే ప్రశ్న ప్రశ్నగానే ఉండిపోయింది. అభిజ్ఞులైనవారైనా తెలుపగలరనే ఆశతో సమాలోచన పత్రికాముఖంగా ఈవిషయాన్ని విన్నవించుకుంటున్నాను. అట్టి బంధకవిత్వ పద్యాలను తెలిపేముందు ఆ పద్యాలుగల అధ్యాత్మరామాయణాన్ని గురించి ప్రస్తుతం అవసరమున్నంత వరకు సంక్షిప్తంగా విన్నవిస్తాను.

అధ్యాత్మరామాయణ ఇతివృత్తం సుప్రసిద్ధం. పెద్దన సోమయాజి అధ్యాత్మరామాయణమును గద్వాల సంస్థాన ప్రభువగు చినసోమభూపాలుని కోరిక మేరకు ఆంధ్రీకరించినాడు. ఈ ఆంధ్రీకరణము క్రీ. శ. 1775 మన్మథనామ సంవత్సరం నాటికి జరిగినట్లు ఈ క్రింది పద్యం తెలియజేస్తోంది.

అచల నవ రసైక రచితభాక శకాప్తి
మన్మథాభిహిత నమస్ఫుటాప్తి
నలరచేసె నిజ మహాకృతి నధ్యాత్మ
రామమూర్తి జగతి రమ్యకీర్తి.

—అధ్యాత్మరా_8 అ.426 ప.

(అచల=7, నవ=9, రస=6, ఏక=1 శకాప్తి .. శా.శ. 1697. క్రీ శ=1697+78_1775).

క్రీ. శ. 1775లో రచింపబడిన కాణాదంవారిఅధ్యాత్మరామాయణమును క్రీ.శ. 1879 (శా. శ 1801 బహుధాన్య) లో గద్వాలసంస్థాన ప్రభువులు సాహిత్యవిద్యామందిరమునెడు స్వకీయ ముద్రాక్షరశాలయందు అచ్చువేయించి ప్రచురించినారు.

కాణాదంవారి అధ్యాత్మరామాయణమున ఈక్రింది బంధాలు ప్రయోగింపబడినవి.

1. పుష్పమాలికా బంధము _ 2 అ _ అయోధ్యకాం _ 570 ప.

2. జాంబవత్పాద బంధము _ 4 అ కిష్కింధకాం _ 378 ప.

3. రథబంధము _ 4 అ_కిష్కింధకాం _ 374 ప.

4. విశ్వముఖ మత్స్యత్రయ బంధము _ 5 అ _ సుందరకాం _ 242 ప.

5. గోమూత్రికాబంధము _ 5 అ _ సుందరకాం _ 244 ప.

6. ఖడ్గబంధము _ 6 అ _ యుద్ధకాం. పూర్వభాగం _ 391 ప.

7. చక్రబంధము _ 7 అ _ యుద్ధకాం. ఉత్తర భాగం _ 412 ప.

8. ఛత్రబంధము _ 7 అ _ యుద్ధకాం_ ఉత్తరభాగం _ 418 ప.

పై ఎనిమిది బంధాలలో అనుబంధాలకు చిత్రాలెలా ఉంటాయో బంధకవిత్వ పరిచయం గలవారికి కొందరికూ తెలుసు. ఇకపోతే తెలియని బంధాలు రెండు. అవి : జాంబవత్పాదబంధము, విశ్వముఖ మత్స్యత్రయ బంధము. ఈ బంధాల పద్యాలివి_

జాంబవత్పాదబంధము:_

చం. రాముసహోసు తిర్యగి ధరాధర
పోమమ్మపొత్మపారసా
రామధరాధరా వరవర స్తవసాదరణ
ప్రమోద పా
రామల శీల ధర్మ రచితాద్యవతార
కృతావనప్రభా,
రాముని మౌనితాదురిత రాజ విభంజక
భక్తరంజకా,

(తరువాయి 15వ పేజీలో)

## నూతన పత్రికావిష్కరణ

రాజమండ్రి ఏప్రిల్ 2 :

"సత్యరాగం" నూతన మాసపత్రిక ప్రారంభ సంచికను 'న్యాయవాణి' సంపాదకులు శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి యుగాది నాడిచ్చట ఆవిష్కరించారు.

పత్రిక సంపాదకులు, ప్రైవేట్ కాన్వెంట్ అధినేత శ్రీ డి. వి. వి. సత్యనారాయణ అధ్యక్షత వహిస్తూ సత్యరాగం యింటింటి పత్రికగా ప్రత్యేకంగా యువతరాన్ని తీర్చిదిద్దేదిగా ఉండాలనే ఉద్దేశంతో ప్రారంభించినట్లు తెల్పారు. పత్రికస్థాపనలోగల సాధక బాధకాలను లోగడ 'శివాజీ' ఫ్రెండ్స్ క్లబ్ లో ఉండగా 'భవాని' లిఖితపత్రిక నడిపినప్పుడు తెల్సుకున్నానని ఆ అనుభవంతోనే దీనిని ప్రారంభించినట్లు నేడు 'స' అనే అక్షరం మొదటగల శ్రీ సూర్యనారాయణమూర్తి ఆవిష్కరించటం, వేదికనలంకరించి జర్నలిస్టు శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి ఆశీర్వదించటం అదృష్టంగా భావిస్తున్నామన్నారు.

తొలుత శ్రీమతి కె. వి. రామలక్ష్మి ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమైంది. శ్రీరామభక్త గానసభ వ్యవస్థాపకులు శ్రీ నిమ్మలపూడి వీర్రాజు వేదికనలంకరించిన పెద్దలను పరిచయంచేశారు. శ్రీ పోతుకూచి ప్రసంగిస్తూ ఆంజనేయ స్వామికి ప్రీతికరమైన మంగళవారం నాడు వసంత ఆగమనంతో నూతనంగా పత్రికను ప్రారంభించడం ముదావహమని, శ్రీ స్వామి మాదిరిగా చిరంజీవిగా వర్ధిల్లుతుందని అన్నారు. 'సత్యరాగం' సాహిత్యపరంగా మనసంస్కృతికి ప్రతిబింబంగా యుండాలని కాంక్షించారు.

## 9. తెలుగు దండక సాహిత్య సూచి.

( గత సంచిక తరువాయి )

15. పేరుతెలియదు రామస్వామి దండకము. వ్రాతప్రతి నెం. 233 ...ర్యులు
16. ,, రామానుజ దండకము. ,, నెం. 26[illegible]
17. ,, హనుమద్దండకము. ,, నెం. 22[illegible]
18. ,, ,, ,, నెం. 276
19. ,, విఘ్నేశ్వరదండకము. ,, నెం. 278
20. ,, శ్రీ వీరభద్ర దండకము. ,, నెం. 17
21. కృష్ణమాచార్యులు, అకలంక, కొమ్మలపాటి దండకము. నెం. 134
22. తెలియదు. శ్రీరామదండకము, ,, నెం. 156
23. ,, సుబ్రహ్మణ్య దండకము. ,, నెం. 197
24. గోవిందుడు, హనుమద్దండకము. ,, నెం. 236
25. పూర్ణకవి, వాణీల శక్తి దండకము. ,, నెం. 236

### ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ – రాజమండ్రి

1. పేరు తెలియదు. హనుమద్దండకము. నెం -17
2. ,, మరాభాండేశ్వర దండకము. నెం -129.

### –: ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ – హైదరాబాదు :–

1. రామయోగి, వడిమింటి. భల్లాణదండకము, సమగ్రతాళపత్రప్రతి. నెం. 87
2. పే తెలియదు, అమ్మవారిదండకము. ,, నెం. 5628
3. ,, ఆంజనేయ దండకము. అసమగ్ర తాళపత్రప్రతి. నెం. 779
4. శ్రీరామకవి. కొల్లాపురమ్మ దండకము. సమగ్రకాగితప్రతి. నెం. 526
5. పేరు తెలియదు. యతిరాజ దండకము. అసమగ్రతాళపత్రప్రతి. నెం. 248
6. నారప్ప. రాధామనోనందగోపాలకృష్ణదండకము. సమగ్ర తాళపత్రప్రతి. నెం. 3414
7. నారాయణకవి. విఘ్నేశ్వరదండకము. సమగ్రకాగితప్రతి. నెం. 3844
8. పేరుతెలియదు. శివదండకము. సమగ్రతాళపత్రప్రతి. నెం. 3418
9. ,, శ్రీకృష్ణదండకము. ,, నెం. 3289
10. నారాయణకవి, ఉయ్యాలవాడ. శ్రీ రంగదండకము. ,, నెం. 2312

### :– ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ – మద్రాసు :–

1. వేదాంత దేశికులు. గరుడదండకము. నెం.
2. వేంకట సుధి. లక్ష్మి దండకము, నెం. 9728
3. పేరు తెలియదు. వేదాంతదేశిక దండకము. ,, నెం. 9662
4. ,, అంబుజవల్లి దండకము. ,, నెం. 9707
5. వేంకటేశకవి. కోమలవల్లి దండకము. ,, నెం. 9710
6. విష్ణుకవి, వరద, సీతాదండకము. ,, నెం. 9792

సమాచారమ్ సంపాదకులు శ్రీ గంధం నాగసుబ్రహ్మణ్యం. ఈనాడు సబ్ ఎడిటర్ శ్రీ పార్థసారధి ఆంధ్రపత్రిక కరస్పాండెంట్ శ్రీ కంచుమర్తి శ్రీరా ఘ ములు, శ్రీ ప్రసాద్ ప్రసంగించారు. పలు · చందాదారులుగా చేరారు. పత్రిక ముద్రించిన శాస్త్రప్రెస్ అధినేత శ్రీ రామచంద్రరావు తమపూర్తి సహకారాన్ని ప్రకటించారు.

సంపాదకులు శ్రీ దీక్షితుల వీరవెంకట సత్యనారాయణ వందన సమర్పణ అనంతరం అల్పాహారవిందు జరిగింది.

(శ్రీ సత్యవోలు)

( * * * )

---

(18వ పేజీ తరువాయి)

విశ్వముఖ మత్స్యత్రయ బంధము:-

చం. కరిసుత చిద్విలాస యువ ఘస్మర
ఘస్మర మిత్రబాంధవా
శరజవిలోచనా విజయ సత్వర సత్వ
రతాత్మ శైశవా
విరచితశీల రాఘవ రవిగ్రహ విగ్రహ
వర్తి మాధవా
విరళ కథోత్సవా నిఖిల విద్విభవా జగ
దీశ కేశవా.

బంధకవితా పారంగతులు, పండితులు, పరిశోధకులు పై రెండు బంధాలు చిత్రాలెలా ఉంటాయో తెలిస్తే చెప్పండి. తెలియకపోతే అపూర్వమైన ఈ బంధాలు చిత్రాలెలా ఉంటాయో ఆలోచించండి. ఆలోచన కందిన చిత్రాలు 'సమాలోచన' ద్వారా పాఠకలోచనాలకు దర్శింప చేయగలరని సవినయంగా మనవి చేస్తున్నాను.

—0—

| | | | |
|---|---|---|---|
| 7. | పేరు తెలియదు. | గోపాలదండకము. | నెం. 9956 |
| 8. | ,, | రంగనాథ దండకము | నెం. 10237 |
| 9. | ,, | రామదండకము. | నెం. 10281 |
| 10. | ,, | కరిగిరిదండకము. | నెం. 1050 |
| 11. | ,, | ఆచార్యదండకము. | నెం. 9391 |
| 12. | ,, | నృసింహదండకము. | నెం. 9391 |
| 13. | ,, | అంకమ్మదండకము | నెం. 1972 |
| 14. | కోసింహుడు. | కనకదుర్గ దండకము. | నెం. 1976 |
| 15. | ధూర్జటి. | శాళహస్తీశ్వర దండకము. | నెం. 1877 |
| 16. | పేరు తెలియదు. | కృష్ణదండకము. | నెం. 1978 |
| 17. | ,, | ,, | నెం 1979 |
| 18. | ,, | గణేశ్వరదండకము. | నెం. 1980 |
| 19. | ,, | గ్రామదేవతదండకము | నెం. 1981 |
| 20. | ,, | తారావళి దండకము. | నెం. 1989 |
| 21. | ,, | తిట్టుదండకము. | నెం. 1988 |
| 22. | ,, | దేవీదండకము. | నెం. 1984 |
| 23. | ,, | , | నెం. 1985 |
| 24. | కోదండరామయ్య | దేశమ్మవారి దండకము, | నెం. 1986 |
| 25. | పేరు తెలియదు. | నృసింహ దండకము. | నెం. 1987 |
| 26. | | పోలమ్మ దండకము, | నెం. 1990 |
| 27. | ,, | ,, | నెం. 1991 |
| 28. | వెంకన, సుదురుపాటి. | బృహన్నాయికా దండకము. | నెం. 1992 |
| 29. | నారాయణకవి, ఉయ్యాలవాడ, | రంగనాయక దండకము. | నెం. 2002 |
| 30. | పేరు తెలియదు. | రామదండకము. | నెం. 2004 |
| 31. | ,, | ,, | నెం. 2005 |
| 32. | ,, | రామానుజదండకము. | నెం. 2007 |
| 33. | ,, | రామలింగేశదండకము | నెం. 2008 |
| 34. | ,, | రుక్మిణీనాథ దండకము | నెం. 2009 |
| 35. | ,, | విఘ్నేశ్వరదండకము. | నెం. 2012 |
| 36. | ,, | ,, | నెం. 2013 |
| 37. | ,, | విష్ణుదండకము | నెం. 2015 |
| 38. | ,, | వీరభద్రదండకము | నెం. 2018 |
| 39. | ,, | | నెం. 2016 |
| 40. | ,, | వేంకటేశ్వర దండకము | నెం. 2019 |
| 41. | ,, | వేంకటేశ్వర దండకము | నెం. 2029 |
| 42. | ,, | శక్తి దండకము | నెం. 2021 |
| 43. | ,, | శరభేశ్వరదండకము | నెం. 2022 |

(తరువాయి 16వ పేజీలో)

# వినుత గుణశీల పోతనా!

—శ్రీమాన్ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

సీ. మందార మకరంద మాధుర్య ధుర్యమౌ
భవదీయ కమనీయ కవిత కవిత
నిర్మల మందాకినీ లసద్వాహినీ
సమ భవత్సుకవితా శైలి శైలి
లలిత రసాల పల్లవకోమలమ్ము, లస
త్పుండరమ్మైన నీ సుకృతి సుకృతి
పూర్ణేందు చంద్రికా స్ఫూర్తిని మరిమరి
గేలిజేసెడు నీదు కీర్తి కీర్తి

గీ. అంబు జోదర దివ్యపాదారవింద
భజనజేసిన భవదీయ భక్తి భక్తి
వినుత గుణశీల పోతనా! వేయునేల?
లేడు నినుబోలు సుకవి యీనాడు-నాడు.

---

( 16వ పేజీ తరువాయి )

| | | | |
|---|---|---|---|
| 44. | ,, | శివదండకము. | నెం. 2024 |
| 45. | ,, | ,, | నెం. 2025 |
| 46. | ,, | ,, | నెం. 2027 |
| 47. | ,, | సంగమేశ్వరదండకము. | నెం. 2028 |
| 48. | ,, | సిద్ధేశ్వరదండకము. | నెం. 2029 |
| 49. | ,, | సూర్యదండకము | నెం. 2030 |
| 50. | ,, | హనుమద్దండకము. | నెం. 2038 |
| 51. | ,, | ,, | నెం. 2040 |

52. నారాయణరావు, కాశ్యకూరి. శ్రీమజ్జగద్గురుస్తోత్రరత్నము (దండకము) కాశ్యకూరి నారాయణరావుగారి మనుమడు, నెల్లూరుజిల్లా రిటైర్డుజడ్జి శ్రీ కె. పి. నారాయణరావు గారివద్ద ఉన్న అముద్రిత వ్రాతప్రతిలో ఉంది.

...* సమాప్తం *...

Editor, Printer and Publisher B. Ravikanth, Printed at B. V. & Co., Press,
TyagarajaNagar, Rajahmundry - 1.